# అప్రస్తుతప్రశంస.

ఇది

శ్రీ పీఠికాపుర సంస్థాన కవియు

శతావధానియు నగు

## వి. ఆర్. కృష్ణశాస్త్రిచే

వ్రాయఁబడినది

గీ. వినుఁడు! సజ్జనులార! వేర్వేఱుచోట్ల
వారు సూపెడునట్టి విద్వత్తకంటె
నెక్కుడుగఁ జూపనున్నార మిదియ! ప్రతిన
రాను రప్పింపఁబనిగానరాదుమాకు.

మొదటి కూర్పు 1,000 ప్రతులు.

కాకినాడ:

సుజనరంజనీ ముద్రాక్షరశాలన్ముద్రితము.

వెల రు 0-4-6 లు.

# పీఠిక.

---

భిన్నాభిప్రాయములతో నెవ్వరైన నీ గ్రంథమును దూషించుచుఁ గాని, మఱియు నిందించుచుఁ గాని. యేమైన వ్రాసినచోఁ బ్రత్యుత్తరము చేయఁబడవు. భాషాభివృద్ధికిఁ జేయఁదగిన పను లనేకము లున్నవి. ఈ యప్రస్తుతప్రశంసలతోఁ గాలము వ్యర్థము సేయుట ధర్మము కాదు. సరసముగను, సయుక్తికముగను వ్రాయలేక నింధించినచో " వారి నిందలు వారి తిట్లు వారికే" యని యొక్క మాఱుగానే సమాధాన మిచ్చుచున్నాను.

రామకృష్ణశాస్త్రి.





# అప్రస్తుతప్రశంస.



చదువరులారా! మీ రిప్పుడు చదువుచున్న గ్రంథము నకు "అప్రస్తుతప్రశంస" యని పేరు. మీరు మాత్ర మీ పేరు వినినతోడనే మఱియొక లాగు దోఁచు నని నే నూహించుచు న్నాఁడను. కావున మీ రీయప్రస్తుతప్రశంసతో మన కేమి పని యనియుపేక్షింపక సాంతముగ నీ గ్రంథమును జదివి దీని కీ నామము సార్థకముగ నున్నదో లేదో నిర్ణయింపుఁడు. మన దేశమున ననేకస్థలములయందు విద్యార్థికు లనేకు లున్నారు. వీరిలోఁ గొందఱు వ్యాకరణశాస్త్రమందును గొందఱు తర్క శాస్త్రమందును మఱికొందఱు మఱికొన్ని యితరశాస్త్రము లందును, మఱియుఁ గొందఱు కవిత్వమందును గొందఱు భాషాంతరములయందును విశేష సామర్థ్యమును జెందియు న్నారు. కాని సర్వేశ్వరుఁడు వీరి కిట్టి సామర్థ్యమును బ్రసా దించినందులకు దానిని దేశాభివృద్ధికిఁ గాని భాషాభివృద్ధికిఁ గాని వినియోగింపక "మేము గొప్పవారము మేము గొప్ప

వారి"మని వాదులాడుచుఁ దమ నిరుపమానపాండిత్యము నడవిఁ గాసిన వెన్నెలను జేయుచున్నారు. మనదేశమునఁ గల పండితు లందఱు నిట్లే యున్నారా? లేదు; లేదు. అక్కడక్కడ శాంతస్వభావు లగు కొందఱు మహానుభావులు లేకపోలేదు. వారు తమ సామర్థ్యానుసారముగ భాషాభివృద్ధికై పాటుపడకుండుటయు లేదు. తఱుచుగా వాదులాడు వారే యుండుట చేత "విద్యా వివాదాయ" యని పెద్దలు చెప్పిరి. పోనిండు ఎవ్వ రెట్లున్న నేమి యందురా? నేనుచెప్పునది యప్రస్తుతప్రశంసయే యని మొట్టమొదటనే విన్నవించియున్నాను. కావున నా తప్పు క్షమింపుడు. ఎందులకీ పండితులకుఁ బరస్పరక్రోధములు? ఎందులకీ మహానుభావుల కన్యోన్యాసహనములు? ఎందులకీ మనీషుల కహంభావములు? ఎందులకీ మహాత్ములకు దుర్వాదములు? దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు ఓలేటి వేంకటరామశాస్త్రి గారికిరిజస్టరునోటీసు నిచ్చుట యెందులకు? ది. తి. శాస్త్రిగారికి వేంకటరామశాస్త్రి గారికి నేమి సంబంధము గలదు? వీ రిరువురు దాయాదులా? కారు. వీరిరువురకును బరిచయ మైనఁ గలదా? లేదు. మఱి యిఁక రిజస్టరు నోటీసు నిచ్చుటకుఁ గల కారణ మేమి? మీ రింతకు మున్ను తిరుపతిశాస్త్రి గా రచ్చొత్తించిన లేఖను గాని వార్తాపత్రికలను గాని చదివి యున్నను మీ కది యంత విశ

దముగఁ దెలిసి యుండదు. కావున నేనా సమాచారమును స విస్తరముగ నిందు వ్రాయుచున్నాను. చిత్తగింపుఁడు.

తిరుపతివేంకట కవులను, వేంకటరామకృష్ణ కవులను మీ రింతకు ముందువిని యే యుందురు. ఈ కవిచతుష్టయము లో దివాకర్ల తిరుపతిశాస్త్రి గారు గాక తక్కిన మువ్వురును బంధుగులు. ఇంతె కాక వేంకటశాస్త్రి గారికిని వేంకటరామ శాస్త్రి గారికిని గొంచెము గురుశిష్యసంబంధము గూడఁ గలదు. కాలనిర్ణయమును నేను వివరముగ నెఱుఁగను. కాని యెడ్వర్డు చక్రవర్తి గారి పట్టాభిషేకమునకుఁ బూర్వము వేంకటశాస్త్రిగారి యొద్ద వేంకటరామశాస్త్రిగారు వ్యాకరణము ప్రారంభించి కొన్ని మాసములవఱకుఁ గౌముదిలో స్త్రీప్రత్యయాంతమే—ఎంతైన నేమి ? చదివిరి. వీరు వేంకటశాస్త్రిగారి యొద్దఁ జదువుకొన నారంభించుటకు ముందే కవిత్వలక్షణము నేర్చుటయుఁ గవిత్వము చెప్పుటయు నెల్ల రెఱుంగుదురు. వేంకటశాస్త్రిగారు కూడ నీ విషయమున మఱియొక విధముగఁ జెప్పెద రని యనుకొనను. వేంకటశాస్త్రిగారి యొద్దఁ జదువునపుడు వేంకటరామశాస్త్రిగారికిని ది॥ తి॥ శాస్త్రిగారికిని బరిచయము గలుగకుండునా యని మీకుఁ దోఁచవచ్చును. అప్పుడు తిరుపతివేంకటకవులు విడి చెఱియొక చోట నుండిరఁట. వేంకటశాస్త్రిగారు మాత్రమే సంచారముఁ జేయుచు

వచ్చి యుండుట. కాన వీ రిరువురకుఁ బరిచయము గలుగలేదు. చదువు నప్పుడే కాదు, వారి యొద్దఁ జదువ మానిన తరువాత నే కాదు, నేటి వఱకు వేంకటరామశాస్త్రి గారికి వేంకట శాస్త్రిగారి యెడఁ గల గౌరవము శ్లాఘనీయము. వేంకట శాస్త్రిగారికిఁ గూడ వీరి యెడఁ గల యనురాగ మట్టిది యే. కాని వేంకటరామశాస్త్రిగారు పీఠికాపురసంస్థానములోఁ బ్రవే శించిన తరువాత నది కొంచెము మాఱినది. దాని కొకకార ణము గలదు. అది కూడ సవిస్తరముగ నిం దుదాహరింప వలసిన దే.

వేంకటరామశాస్త్రి గారు కాకరపర్తిలోఁ జిన్నటి నాఁటినుండి యుఁ జర్లనారాయణశాస్త్రి గారి యొద్దఁ గావ్య నాటకాలంకారగ్రంధములు లఘుకౌముదియుఁ జదివిరి. పిమ్మట వీరును నేను గలసి రచించిన గ్రంధములయందు గురుస్తుతిఁ జేయుపట్ల నారాయణశాస్త్రిగారినే స్తుతించుచు వచ్చితిమి. ఉభయులకుఁ గూడఁ దామే గురువులై విశేషకాలము విద్య నుపదేశించి మమ్ముఁ బ్రాజ్ఞుల నొనర్చిన నారాయణశాస్త్రి గారల్లు స్తుతింపఁబడుట యర్హమే. మేము పీఠికాపురసంస్థాన మునఁ బ్రవేశింపక ముందే దమయంతీకల్యాణ మను శుద్ధాం ధ్రప్రబంధమును వ్యాసాభ్యుదయ మను మిశ్రప్రబంధమును రచించి 1907 సం॥రమున దమయంతీకల్యాణమును 1908సం॥

రమున వ్యాసాభ్యుదయమును బ్రకటించితిమి. దమయంతీ కల్యాణమున వేంకటరామశాస్త్రి గారిచే నిట్లు గురుస్తుతి సేయఁబడి యున్నది.

క. కూరిమి మా యిరువురకుం
బేరిమి వెలుపుల బాసఁ • బెం పగు సత్త్రిన్
గూరిచిన యసవు దొరవున్
నారాయణశాస్త్రిగురువు • నా మదిఁ దలఁతున్.

అట్లే పీఠికాపురమునకు వచ్చినప్పుడు గూడ సభ్యులలో నెవ్వ రైన "మీ గురు వెవ్వ" రని యడిగిన పట్లఁ గాని గురుస్తుతి సేయు పట్లఁ గాని మేము నారాయణశాస్త్రిగారినే పేరుకొంటిమి. ఇదియే వేంకటశాస్త్రిగారికి వేంకటరామ శాస్త్రిగారి యెడ ననుగ్రహము తప్పుటకుఁ బ్రథమబీజము. 1907 సం॥రములోఁ బ్రకటించిన దమయంతీకల్యాణమునం దును 1908 సం॥రమునఁ బ్రకటించిన వ్యాసాభ్యుదయమం దును దమ్ముఁ గురువు లని వ్రాయకున్నందులకు సహించిన వేంకటశాస్త్రిగారు 1909 సం॥రమున జరిగిన సభలోఁ జెప్ప కుండుట కేల యాగ్రహించిరో ?

పిమ్మట వేంకటశాస్త్రిగారు ప్రస్తుతము తాము తెలుగు టీచరుగా నున్న హైస్కూలుకు సెలవు లిచ్చిన తోడనే బందరునుండి "నేను వేంకటరామశాస్త్రికి గురుఁడను ! గురుఁ

డను!!" అనుచు వచ్చి వేంకటరామశాస్త్రిగారిని గలసికొని "నీవుపీఠికాపురసంస్థానమున నవధానములు సేసినప్పుడు నన్ను గురువుగా నేల చెప్పలేదు?" అని యిట్లాగ్రహమును సూచించుచుఁ గొన్ని ప్రశ్నలు వేయఁగా వేంకటరామశాస్త్రి గారు "మీరును నాకు గురువులే యిఁక ముందు బేర్కొనఁ గూడదా" యని చెప్పి వారిని శాంతింపఁ జేసిరి. కాని హృదయమున మాత్ర మాకళంక మొకకొంత మిగిలియున్నది కాఁబోలు! వేంకటశాస్త్రిగారు వేంకటరామకృష్ణకవుల యవధానములు మా యవధానములవంటివి కా వనియు వీరి కవిత్వము మాకవిత్వమువలె సరసముగ నుండ దనియుఁ బాదక్రమంబునఁ జేయు శతావధానమునకు వీ రెవ్వియో మార్పులు గల్గించి రనియు జెప్పుచు వచ్చి రఁట. ఆమాటలను మేము కొందఱి వలన విని సౌమ్యసంవత్సరమున విజయదశమిపండుగులలో శ్రీ శ్రీ శ్రీ రాజావారిని గోరి పదిగంటలలోఁ బాదక్రమంబునఁ జేయు శతావధానమును సంపూర్ణజయప్రదముగ నొనరించితిమి. కవిత్వసారస్యవిషయమా? "లోకోభిన్నరుచిః" కావున నేను చెప్పుటకంటె మీరు నిర్ణయించుకొనుట మంచిది.

అది యట్లుండ నీ మధ్యకాలములో నొక యీశ్వరవేరు బయలుదేరినది. ఈ యీశ్వరవేరుమూలమున నే వీరి క్రోధ

లతాంకూరము లుద్భవించి కర్ణజపవచనామృతసేకంబున దిన దినప్రవృద్ధంబులై యిప్పటికి సలుగడల నల్లికొనినవి. ఈ యీశ్వరవేరేస్థలమున నేవిధముగాఁ బుట్టినదో నిజముఁ దెలియవలయునని ప్రయత్నము సేయఁగా వేంకటశాస్త్రిగారికి నివాసస్థలమైనట్టియు వేంకటరామశాస్త్రి గారి గ్రామమున కనతిదూరమున నున్నట్టియు "ఇంజర" మను గ్రామమున నొకప్పుడొకచోట బ్రాహ్మణసంతర్పణము జరిగిన దనియు భోజనసమయమున నుబుసుపోక యెవ్వరో వేంకటరామకృష్ణకవులు తిరుపతివేంకటకవులకుఁ జాల రనియు మఱియుఁ బెక్కుగతుల నిందించుటయును, కొందఱు వారి సంభాషణము శ్రుతికటువుగ నుండుటచేఁ దిరుపతి వేంకటకవులకు వేంకటరామకృష్ణకవు లీశ్వరవేరులవంటివారని వాక్రుచ్చిరనియుఁ దెలియవచ్చినది.

తరువాత మఱికొంత కాలమునకు వేంకటశాస్త్రి గారు కార్యాంతరముచే "నింజర" గ్రామమునకు వచ్చినప్పుడు వారి యనుగ్రహము సంపాదింపఁ దలఁచి యెవ్వరో కలియుగనారదులు పైసమాచారము నంతయు మాఱుపఱిచి వేంకటరామశాస్త్రిగారు స్వయముగఁ దిరుపతివేంకటకవులకు మే మీశ్వరవేరుల మని పల్కినట్లు చెప్పిరి. ఈకలహాశనుల మాట వేంకటశాస్త్రిగారి హృదయమున రగులుచున్న క్రోధాగ్నిహోత్ర

మునకుఁ బూర్ణాహుతి యైనది. ఇందుఁ గొండెము సెప్పిన వారి తప్పేమియు లేదు. ప్రతిఫల మున్నను లేక పోయినను వారి కట్లు కొండెములు సెప్పుట స్వభావము. వృశ్చిక మేమి ఫలము నపేక్షించి కుట్టుచున్నది? పండితులై యుక్తా యుక్తముల నెఱింగి వేంకటరామశాస్త్రిగారి సత్స్వభావమును దెలిసియున్న వేంకటశాస్త్రి గారా కొండెగాండ్ర మాటలకుఁ జెవి యొగ్గుట యద్భుతము! మొట్టమొదట ననఁగా గురుత్వవివాద కాలమున మీకుఁ గొండెకాండ్రు చెప్పిన మాటలు విశ్వసింపఁ దగ వని వేంకటరామశాస్త్రిగారు చెప్పిన వచనముల నైనఁ దలఁచి కొనఁ గూడదా? మొదటికేతిగనే వేంకటరామశాస్త్రిగారిని గలసికొని మీరు మ మ్మిట్లనుటకుఁ గారణ మేమని యడి గినచో నిజము తమకు బోధపడకుండునా? తమ కంత తీరిక లేనిచో నొకకార్డు వ్రాసిన దానికి సరియైన ప్రత్యుత్తరము రాకుండునా? “ఔను గాని యీ కలహమున వేంకటశాస్త్రి గారి కేమి సంబంధము గలదు? వీరి నిట్లు ప్రధానులఁజేయవలసిన పనియేమి? అని మీకుఁ దోఁచవచ్చును కాని దీని కంతకును ప్రోత్సాహకర్తలు వేంకటశాస్త్రిగారేయని యూహించుట కవకాశము గలదు. ఒక్క ప్రోత్సాహకర్త లే యన నేల? ప్రప్రధమమున జరిగిన సమాచారమంతయు వేంకట శాస్త్రిగారి చేతి మీఁద నే జరిగినట్లు తోఁచు చున్నది. మఱి

యిఁకఁ దిరుపతిశాస్త్రిగారి పే కేల పెట్టి రంమరా? వేంకట శాస్త్రిగారికిని మాకును బంధుత్వము గలదని యిదివఱకే చెప్పియున్నాను. ఆ మోమోట మేమైనఁ గలదేమో? తిరు పతిశాస్త్రిగారు వేంకటశాస్త్రి గారి కన్న శాంతస్వభావము గలవారని కొంద అందురు. కాని యేకారణముచేతనో యీవి షయమున వేంకటశాస్త్రిగారిని శాంతింపఁ జేయ రైరి. ఒక వేళ నట్లు చేసినను వారి కా శాంతవచనములు పనికి రాకపో యెనేమో? అచ్చటి సమాచారములు నా కెట్లు తెలియును? దీనికి మఱియు నితరకారణము లెన్ని యున్నవో? ప్రోత్సాహ కు లెంద రెంద ఉన్నారో? ఈ విషయ మింతటితోఁ గట్టి పెట్టి యిఁక రిజిస్టరునోటీసు సమాచార మందుకొందము.

ప్రప్రథమమున "మహారాజశ్రీ ఓలేటి వేంకటరామయ్య గారికి రవానా, పిఠాపురము. శతావధాని దివాకర్ల తిరుపతి శాస్త్రి యొద్ద నుండి" అను విలాసమును వ్రాసి నోటీసును బంపించిరి. దానిని వేంకటరామశాస్త్రి గారు త్రిప్పి వేసిరి. అట్లు త్రిప్పి వేయుటకుఁ గారణము మీ కీ చిరునామను బట్టి యే యూహింపవచ్చును. ఇంతకు మున్ను పరిచయము గాని బంధుత్వముగాని లేని ది. తి. శాస్త్రిగారును వేంకటరామశా స్త్రిగారును జాబులు వ్రాసికొను నప్పుడు గౌరవమును సూచించు విలాసములు వ్రాయవలయుఁ గాని వేంకటరామ

శాస్త్రిగారి పేరు వేంకటరామయ్యగా రనియు, తిరుప శాస్త్రి గారి పేరు తిరుపతయ్యగా రనియు మార్చి వ్రాయుట యుక్తమా? అట్లు వ్రాసినప్పుడు ది. తి. శాస్త్రిగారి నోటీసు నెట్లందుకొందురు? రిజిస్టరు నోటీసును రసీదు మీఁద చేవ్రాలు లేకుండఁ దీసికొనుటకుఁ బత్రికాప్రేషకసంఘము వా రొప్పుకొనరు. పుచ్చుకొనవలెననిన నోటీసు మీఁద వ్రాసిన చొప్పుననే వ్రాయవలయును గాని మఱియొక రీతిగాఁ జేయ వలనుపడదు. దీనిని బట్టి చూడఁగా వేంకటరామశాస్త్రిగా రెట్లయినను నోటీసుఁ ద్రిప్పివేయవలయునని యే తిరుపతిశాస్త్రిగా రట్లు వ్రాసి రని వెల్లడియగుచున్నది. అట్లు త్రిప్పివేయుటఁ దమకు వారు వెఱచిరని ప్రచురించుకొనుటకుఁ గాఁబోలును? తరువాత నా నోటీసులోని సంగతులు వార్తాపత్రికలయందు వారిచేఁ బ్రకటింపఁబడినవి. మఱికొంతకాలమునకు 8 పుటలు గల యొకలేఖను వారే ప్రచురించిరి. నిష్పక్షపాతబుద్ధితో నా లేఖను విమర్శించి చూతము.

,,ఆప్తులారా! ప్రస్తుతకాలమునఁ బిఠాపురసంస్థానమున నుండి శతావధానులమని పేరుపెట్టుకొనినవారిలో నొకరిపేర రిజిస్టరులెటరు వ్రాసి వారు త్రిప్పివేయుటంజేసి యదిపత్రికాముఖంబున బ్రకటించితిని. పిదప వారుదానికి సమాధానమని చాఁటుగాఁ బ్రచురించిన పద్యము లోకమిత్రునివలన నాకు

లక్షించి మఱలఁబ్రత్యుత్తరము రిజిస్టరుచేసి పంపితిని. అదియును వారు త్రిప్పివేసిరి. ఈవిషయమెల్ల సజ్జనులకుం దెలియుటకై పత్రికాముఖమునఁ బ్రకటించుచున్నాను.

డి. తి. శాస్త్రి."

వింటిరా ? వేంకటరామకృష్ణ కవులు శతావధాను లని పేరు పెట్టుకొన్నవారఁట ! తిరుపతివేంకట కవులకు శతావధాను లను పేరు పుట్టువుతోడనే మొలచినది కాఁబోలు ! ఔ నది నిజమే. నాలుగు గంటలలో నత్యద్భుతశతావధానమును పదిగంటలలోఁ జెఱియొకపాదమును జెప్పు శతావధానమును గంటలో నూఱుపద్యములను జేసి యున్నవార మే యైనను మేము శతావధాను లను పేరును దిరుపతివేంకట కవులకే వదలివేయుట మంచిది. ఈశతావధానబిరుదము వారికి మాత్ర మెందులకు ? వారికి మాత్రము బిరుదులు లేవా యేమి ? కింకవీంద్రఘటాపంచానన, విద్వత్కవి, బాలకళానిధి, బాలసరస్వతి, ఒకటి-రెండు-మూఁడు-నాలుగు- ఓహో ! ఇన్ని బిరుదులు గలవు. ఔను గాని వీరు సందర్శించిన నానారాజులలో నే రాజు కర్పూరతాంబూలం బొసంగి వీరి కీ బిరుదముల నొసంగినాఁడో ? చదువరులారా ! మీరును నా వలెనే సందేహింపకుఁడు. మీ కేతద్విషయికము లగు గాథలు కూరల

గంపలోఁ గానవచ్చును. అంతవఱకు మాత్రము తొందర పడఁ కుఁడు. మీ కీమాట నమ్మకముగ లేదా? పోనిండు. ఒకరిచ్చు వారు నొకరు ధరించువారునా ? "శాస్త్రిగారూ! మీ కీ కుండలము లెవరు వేసినారండీ" యని యడిగిన "మా ప్రత్తి చేనే మా కిచ్చినది. ఒక రిచ్చువారును నేను పుచ్చుకొను వాఁడను నా?" యను నామెతగా వారి కలమే వారి కా బిరుదముల నిచ్చినది. ఇట్లనిన మీకు సంతోషముగ నున్నది కద! సరే! ఇఁక రండు.

మహారాజశ్రీ ఓలేటి వెంకటరామయ్యగారికి.

అయ్యా!

మీరందఱుఁ దిరుపతి వేంకటేశ్వరకవులకు వేంకటరామరామకృష్ణకవు లీశ్వరవేరులని తఱచు వాగ్వ్యయము గావించినట్లు వినుచున్నాము. మీవాదము మీరుస్థిరపఱుచుకొనఁ దలఁచితిరేని దానికిందగినప్రయత్నము మీరు కావించి మమ్ము సభకురప్పింపుఁడు. లేదా మేముకావించి మిమ్ము సభకురప్పించెదము రండు. ఈశ్వరవేరులో జీలుగుబెండ్లోవిద్వల్లోకమే నిర్ణయించెడిగాత!

ఉ. ఆశుకవిత్వమందున జ • యంబువహింతురొ? శబ్దశాస్త్రమం
దాశవహింతురో? మఱియు • నద్భుతరీతి శతావధాన ఘం
టాశతపద్యకల్పనల • డంబువహింతురొ? యీసభార్ధ మే
దేశము మీకుసమ్మతమొ • తెల్పుఁడు సల్పుఁడు తత్ప్రయత్నముల్.

చ. ఒకయెడఁ గూపకూర్మగతి ♦ నుండి ప్రగల్భములాడువారు వే
లకు మఱి వేలకువుల్ గల రి ♦ లాతలమించుకనైనఁ జూచి కీ
ర్తికొ యపకీర్తికో తగిన ♦ రీతి సమార్జనసేయుటొప్పు ; నూ
రక తగనుండుటొప్పడే భ ♦ రంబు సపూర్ణక లేకయుండినన్.

మ. గురువో శిష్యుఁడొ మీరుఁ దానగుటచేఁ ♦ గోపంబుమా వేంకటే
శ్వరుఁ డిప్పట్ల వహింపఁ డయ్యె నిఁక నె ♦ వ్వారెట్టివారైన నె
వ్వరు శాంతంబు వహించియున్నను వృథా ♦ ప్రాగల్భ్యదుర్వాదమషీ
భరముం దిర్పతి నైచునే ? కవులు నే ♦ బాసందురే ? నైచినన్.

చ. కలిపరిపూర్తిఁ జెందె ; నెవి ♦ గన్పదు విష్ణుపురాణమందు గు
ర్తులు సకలంబునయ్యావిరయె ♦ తోఁచెడు నెల్లెడ ; శిష్యులేడ ? భూ
స్థలి గురులేడ ? యింకనన్ని ♦ తంబుఁ గృతఘ్నత రెండుమాత్రమే
బలముగనూని యెల్లరును ♦ వర్తిలవచ్చు యథేష్టరీతిగన్.

కాకినాడ. 15-6-10. చిత్తగించవలెను.

ఇందు గద్యములో నసంప్రేక్ష్యకారిత్వము ! మొదటి పద్యములో పేరాలాపములు! రెండవ పద్దెమునందుఁ బరనింద! మూఁడవ పద్దెములో నాత్మస్తుతి ! నాల్గవ పద్యమునందు శ్రీరంగనీతులు! గల వని యెల్లరును సులభముఁగా దెలిసికొనవచ్చును. కాన నీ యుత్తరమునకుఁ "ప్రత్యుత్తర మనిఁ చాటుగా వేంకటరామకృష్ణకవులు ప్రచురించిన పద్యములు" అను శీర్షికతో వారు ప్రకటించిన కొన్ని పద్దెములను, ఆపద్యములకు మఱల వారు వ్రాసిన ప్రత్యుత్తరమును వానికిఁ గల తారతమ్యమును బరీక్షింతము.

తిరుపతిశాస్త్రి గా రర్థానుస్వారయుక్తముగ నో చాటు శబ్దమును బ్రయోగించి మాకు వెఱచి వారు రహస్యముగఁ బద్యములఁ బ్రకటించి రని సంతసించుచున్నారు. సంతసింప నింకు ఇవి వారి కంపెనచోఁ “ తిరుపతయ్యగారికి ” యని వ్రాయవలసి యుండును గదా! అట్లు వ్రాసి యాయన మనసుఁ జిన్నబుచ్చుట మనకు ధర్మము గా దను తలంపుతోఁ బత్రికాముఖము కన్న వేయిమడుంగులు మిన్న యనఁ దగు ప్రజాముఖంబునఁ బ్రకటించిన పద్దెములు చాటుపద్యములా ? రిజస్టరున కై మూఁడణాలు ఖర్చు పెట్టక పోయిన మాత్రమునఁ జాటుపద్దెములా ? కానిండు. నిజము గా నవి చాటు పద్యము లే.

(మనోహరము లగు పద్యములు, నిజమును జాటించు పద్దెములు.) పండితు లట్లే యర్థముఁ జేసికొనుచున్నారు. మొదటిగద్యమునకీపద్యము సమాధానము గా నున్నది.

ఉ. మా కవితావిశేషములు ♦ మానసవీథుల సంచరింప వీ
రే! కవిభోగిభోగముల ♦ కీశ్వరవేరు లటంచుఁ గొంద ఱీ
లోకులు పల్కి-చంద్రుడు గుణ ♦ లుబ్ధులు గావున ; మీరు సెప్పినా
గాకవికాచపాత్రల మొ ♦ గంబులు మూయఁగ జేల్లుబెండ్ల మే.

చదువరులారా! ఈపద్యమున కభిప్రాయ మేమి ? మా కవిత్వమును విని సంతసించి కొందఱు లోకులు వేంకట

రామకృష్ణకవులు "దుష్టకవులను సర్పములఁ దలలు వంచుకొనఁ జేయ నీశ్వరవేరుల వంటివా" రని పొగడుచున్నారు గాని మే మన లే దనియు మీరు నిష్కారణముగా మమ్ము జిల్లుబెండ్లని నిందించుచున్నారు; కానఁ గుకవులను గాజుబుడ్ల మొగములు మూయుటకు మేము జిల్లుబెండ్ల వంటివారమే యని యు గదా దీని యభిప్రాయము. ఇం దేమైన ను దిరుపతివేంకట కవుల నిందయున్నదా? దీనికి మజ్జుల వారు ప్రత్యుత్తరము వ్రాయవలసిన యవసర మున్నదా? చూడుఁడు. డి. తి. శాస్త్రిగారు గుకవులనఁ దామే యని భావించుకొని దీని కెన్నిపద్యములు వ్రాసినారో?

క. లోకులనుచున్నవారని
వాకొనమీకేలగొంకు ♦ వాటిల్లదయో
లోకులని మీరు వ్రాయుట
తేఁకువతో జూచిసమ్మ ♦ తింపటగాదే.

క. విను జీలుగు బెండ్లని మి
మ్మనలేదే మేము విద్వ ♦ దవతంసులపై
నునిచితి మా భారమ్మును
గనుఁగొనఁగాలేక వట్టి ♦ కాక్స్రని రొదరే!

ఉ. బెండ్లమనంగ నాడుదు; క ♦ ని ప్రాకరంబున కెల్ల నూఱువే
లెండ్లకునైనఁ గాఁ గలరె ♦ యీశ్వరవేరులు; రాలకుండునే
పండ్లటులన్నచో; శుభము ♦ పల్కుము పెండ్లికుమారుఁడా యనన్
బెండ్లికివచ్చునెల్లరును ♦ బెండ్లములన్న వితంబిదేకదా!

ఉ. మీకవితామహత్వమది ♦ మీకుఁ బ్రవృద్ధుఁడు మెచ్చుఁగాక తా
నేకతమందు మిమ్ముఁగని ♦ యీశ్వరపేర్లనవచ్చుఁగాక యూ
హా! కడువింతలోకులెవ ♦ రాడిరి నీవనృతంబులాడెదే
కాకవి వేపపండ్లుతినుఁ ♦ గాకవి గాకవి యొల్లుతిందురే!

ఉ. కాకవి కాచపాత్రల మొ ♦ గంబులు మూసెడు జీల్గుబెండ్లకుం
జేకులునే సభాస్థితియుఁ ♦ జేకులుఁ గాక దితద్రసంబులం
దైకొనువేళ నాకొక్కకడ ♦ గాఁ బడనైవరె; పట్టుపట్టినన్
మేసకెగించిలాగి బలి ♦ మింబలు ముక్కలు సేయకుందురే!

ఉ. ఏకడకేగి చూచె మఱి ♦ యే నరపాలుర మానసంబులన్
మీకవితావఘాటికర ♦ మింపఁగఁ జేసెరసజ్ఞులైన యే
లోకులు కూడియున్న సభ ♦ లోన నిరర్గళమాధురీపకీ
పాకము రానటించెను ప్ర ♦ పంచకమెల్లఁ జిత్రాపురంబొకో!

హౌరా! ది. తి. శాస్త్రిగారి సాహసము! సరససంభాషణము! సందర్భశుద్ధి! సమయస్ఫూర్తి! సర్వతోముఖపాండిత్యము! ఒకవేళ నీ పద్యములు వేంకటశాస్త్రిగారు రచించినవేమో? అట్లయిన నీ పొగడ్త యంతయు వారికే! ఎవరు రచించిన వారినే పొగడుచున్నాడను! ఇక్కడ నీ పద్యములు రచియించిన వారి నెంతయైనఁ బొగడవలసియే యున్నది. కాని గ్రంథవిస్తరభీతి చే నది యింతటఁ జాలించి ప్రస్తుతాంశమును జూతము.

„లోకు లనుచున్న వా రని చెప్పుటకు మీ రేల సందేహింపరు? లోకుల మీఁదఁ బెట్టి మీరు వ్రాయుటచే

దానిని సమ్మతించుట గాదా? కావున దానిని మీ రనినట్లే మేము తలంచెద" మని మొదటి పద్యమున కభిప్రాయము.

"మేము మిమ్ము జెలుగుబెం డ్లని యన లేదే! ఆభారము నంతయుఁ బండితశేఖరులయందుఁ బెట్టినారము. మీ రాసంగతిని గ్రహింపక మ మ్మూరక యేల నిందించెదరు?" అని రెండవపద్యమున కభిప్రాయము.

కంటిరా? మేము లోకులనుచున్నారని యనఁగా లోకుల మీఁదఁ బెట్టి మేమేయనినట్లుఁట! వీరు పండితుల మీఁద నా భారము వైచినార మనఁగాఁ బండితులమీఁదఁ బెట్టి వీరనినట్లు కాదఁట! వారి కాకనీతి! మా కాక నీతి! ఆహా! ఏమిసందర్భశుద్ధి!

"మీరు "బెండ్లము" అని చెప్పుకొన వచ్చును గాని యీశ్వరవేరుల మని యనఁ గూడదు సుఁడీ! పండ్లూనును." అను నది మూఁడవపద్దెములోని సారాంశము.

వింటిరా? సరసనంభాషణము! పోనిందు మమ్ము నిష్కారణముగ వారు నిందించి రని భావింప రాదు. "కింకవీంద్రఘటాపంచాననబిరుదమును మేము ధరించి నప్పుడు మా కిట్టిగౌరవమే జరిగినది; కావున మీ రిట్టి లేనిపోని బిరుదులు వేసి కొనకుఁడు! పెద్దవార మగుటచే ననుభవసిద్ధముగా

మీకుఁ జెప్పుచున్నాము." అని యకారణకారుణికత్వముతో నిది మాకు వారు సేసిన హితోపదేశము.

"మీ కవిత్వమును మీ కులవృద్ధుఁడు మెచ్చుకొనును గాని మఱి యెవ్వరును మెచ్చుకొనరు". అని నాలుగవపద్య మునం దున్నది.

ది. తి. శాస్త్రిగారూ! దీనికి మేము మఱల సమాధా నము "మీ కవిత్వమును జూచి మీ ముత్తవ్వ మెచ్చుకొన వలయును గాని మఱియెవ్వరును మెచ్చుకొనరు" అని యె కదా వ్రాయవలసి యున్నది? చాలు! చాలు! ఇదియా? మీ సమయస్ఫూర్తి! "నోరు మూసినచో జీలుగుబెండ్లను దీసి పారవేయమా?" అను యుక్తిరాజము నైదవపద్యము చెప్పు చున్నది. నోరు మూసిన పిదప నేమి చేసినను ఫలము లేదు. ఇది యొక సర్వతోముఖపాండిత్యము!

"మీ కవితావధూటిక యెవరిని మెప్పించినది? ఏ రసజ్ఞుల సభలో నటించినది? ప్రపంచ మంతయుఁ బితాపుర మేనా?" అని యాఱవపద్దెమున వ్రాసి యున్నారు.

మే మాంధ్రదేశమున కాభరణం బనఁదగు పీఠికా పురంబున శ్రీ శ్రీ శ్రీ రాజావారి సభలోఁ బలువురు పండితుల సమక్షమున నింతవఱ కెనిమిది సారు లవధానములు చేసినా రము. విజయదశమిపండువులలోఁ దమతమ వార్షికములు

స్వీకరింపను, నూత్న బహుమానములు వడయను, నానాదిక్కు-లనుండి వచ్చిన పండితాగ్రేసరు లనేకులు మా శతావధానమును గని సంతసించి యున్నారు. వీ రందఱు రసజ్ఞులే కారా? మఱి యింకఁ బల్లెలలోను బడులలోను జేసిన సభలేస్తా రసజ్ఞుల సభలు! ఔరా! ఎంత సాహసము!

1,2 పద్దెముల కీ క్రింది పద్య ముత్తరము గా నున్నది.

శా. చూడం జాలక కూపకూర్మము లటంచున్ మమ్ము నిందించె దే
వాడన్ గస్త్రానినం బకించుచును గర్వస్ఫూర్తి భాషించుచున్
వీడంబోవక వెంటవెంటఁ బడుచున్ వేయిండ్లపూజారి యా
వాఁడా నీకు ఘనుండు చాలు నిది; దుర్వాదంబు లింకేటికిన్?.

మమ్ము కూపకూర్మము లని నిందించినపుడు "నీవే కూపకూర్మమవు; నీవే కూపమండూకమవు; నీవే వేయిళ్ళపూజారివి." అని మీఁదఁ బడక "విచారింపకుండ మమ్మేల కూపకూర్మము లనియెదరు? ఏపల్లెటూరిలోఁ జూచినను గరువపు మాట లాడుచు వల దనినను వీడక పద్దెములఁ జదువుచు వేయిళ్ళపూజారియై తిరుగువాఁడు ఘనుఁడా?" అని యడిగితిమి. మఱియు మన మీ విషయమై యొకరితో నొకరు మాటాడుకొని యథార్థమును దెలిసికొనక మునుపే యిట్లు తిట్టుకొనుచున్నార మిది చాలదా? ఇంకను దుర్వాదము చేయవలయునా?" యని మొదటిపద్దెమునకును సమాధానమిచ్చితిమి. మఱియు :—

ఉ. తిట్టి పత్రికన్ గైకొనమి దిం దలపోసితి వాకొ౯? లేనిచో
నిట్టు తెగించి తిట్టుదువె? యీ కవిరాక్షసవృత్తిఁ గైకొనం
గిట్టదు మాకు; మాటికెని గేకలు వైచెద వేల? యంతగా
దట్టుఁడ వైన నీకుఁ దగు తజ్జ్ఞులలో నది సూపరాదొకో!

అను మఱియొక యర్థము గూడ నిందుఁ గలదు.

దీనికి ది. తి. శాస్త్రిగా రెట్లు ప్రత్యుత్తరము వ్రాసిరో చదువుదము.

శా. చూడంజాలని వేద? భూపతుల మెచ్చుల్ జూడఁగా లేనా? యే
జాడం ద్వాదశచిత్రప్రబంధ పరిభాషల్ చూడఁగా లేనా? యే
వాఁ డున్నే నని శతావధానకవితా వల్లీ నవాంకూరముల్
చూడంజాలనా? నీకుఁ గల్గు సిరి హెచ్చుల్ చూడఁగాఁజాలనో!

క. సభకుఁ బిలిపించిన మే
మభయంబున వత్తుమంటి మనగా దేనా
సభకుఁ జ రమ్మంటిమ యీ
యుభయంబున కీవొసంగు నుత్తర మేదీ?

గీ. కూపకూర్మమటంచుఁ బేరొకఁ నుటతప్పె
కూపమం దున్న కూర్మంబు కూయు నెందు;
నరయ నెంతయు బకబకమనెడు కతనఁ
గూపమండూకమనుచుఁ బేరొకఁ నఁగవలయు.

ఉ. గాడిదెకూతకుం బ్రతిగఁ గర్ణకఠోరముగాఁగ నుండి యే
వాడకుఁ బోయినన్ని నెడువారు లభింపని నైతమల్లునాఁ
డేడకుఁ బోవనేమి యగు? నెకడ కేగిన రండలుంచుఁ గొం
డాడుచు వీనులార విను నట్లు కవిత్వము చెప్పనొప్పదే?

చ. గరువముమాటలందుఁ జెలఁగక జగమెల్లఁ జరింపఁజాలు ద్రి
మ్మరితన మేకవీంద్రులకు సైకొనఁజాలు నిరర్గళాద్భుతా
కర రసపుంజమంజుల వికస్వరచారుకథాసుధా ఝరం
ధర బహుళప్రబంధ కవితావనితా చతురోక్తి లేనిచోఁ.

గీ. శక్తి గల్గియు లోకంబు శాస్త్రచయము
గావ్యములుచూచి కాంచిన కౌశలంబు
లేనివాఁడెసుమీ కవి కానివాఁడు
కవికి దేశాటనంబొక్క కానిపనియె ?.

ఇందు మొదటిపద్దెమునఁ దా మేమి చూచి సహింప లేకుండిరో యవి యెల్ల స్పష్టపఱుపఁ బడినవి.

రెండవ పద్యమును "దుర్వాదంబు లిం కేటికిన్" అను వాక్యమునకుఁ గ్రోధావేశముచే నర్థముఁ దెలిసికొనక వ్రాసిరి.

చదువరులారా! మూఁడు నాల్గు పద్యముల నెవ్వరి సమన్వయింతము! కేవలకవితా మాధుర్య మే కాక కంఠమాధుర్యమును గప్పకూఁతవలెను గాడిదకూఁతవలెను గర్త కఠోరముగా నీ నలుగురిలో నెవ్వరికిఁ గలదో వారికి సమన్వయించుట ధర్మము.

అయిదవపద్యము కవులు ముఖ్యముగా గర్వము సంపాదింప వలయు నని బోధించుచున్నది. నే నిదివఱకుఁ గవులకు వినయ మే యలంకార మనుకొనుచున్నాను. అది కాదా? అట్లయిన ది. తి. శాస్త్రిగారు! మీ గర్వమును వృద్ధి సేసికొనుఁడు. కాని పరులకు మాత్ర మిట్లు బోధింపకుఁడు.

ఆఱవపద్యములోని యభిప్రాయము సర్వసమ్మత మై-నది. కాని దేశాటనము సేయుట ప్రధానము గదా యని యొక మహారాజు నాశ్రయించి యుండుట దోషము గాఁ దలఁపఁ గూడ దని మాత్రము శేషమును బూరించితిమి.

3,4 పద్యముల కీ పద్యములు సమాధాన మిచ్చు-చున్నవి.

చ. గురు వని శిష్యుఁ డంచు నొక కొంత చమత్కృతిఁ జూపి వేంకటే
శ్వరుఁడు సహించెఁ గాని యిఁక సైపఁడు తిర్పతి యంచుఁ బల్కె దీ-
వరయిక వేంకటేశ్వరుని యాదరణంబునఁ గాక తిర్పతిక్
దిరుపతి మార్గ మిట్టి దని తెల్ప నెఱుంగ నెవండు గోరెడున్ ?

ఉ. అర్భకు లేమి సేయఁ గల రంచుఁ దలంచితి వేమొ ? యిట్లసం
దర్భము లైన మాటల యథార్థము లంచుఁ దలంప కెంతయున్
నిర్భయవృత్తిఁ బల్కెదు మనీషులు నవ్వ నసహ్యకల్పనా
గర్భితవాక్యసంపదలు గల్గవె ? మాకును వెల్లడింపఁగన్.

చ. చరలకలాబ్ధిచంద్రు కడఁ జాలఁ బఠించితిఁ గాన తత్సభాం
తరముల నాతనిం బొగడఁ దప్పె ? తలంపఁగ నంతమాత్ర నా
కొరుఁడు గురుండు గాఁడె ? యటులుండఁ గృతఘ్నత యంచుఁ బల్కఁగా
గురుధనమున్ హరించితినె ? క్రూరతనంబున నేను తిర్పతీ.

చ. విడివడి మాటిమాటికిని విష్ణుపురాణకథాప్రసంగముల్
దడవెదు నన్ను మాధుటకుఁ దత్పరతం గురుఁ డాతఁ డంచు నే

నొడువక యున్న శిష్యుఁ డని నూటికిఁ గోటికిఁ గూడ నీవు సె
ప్పెదు నది చాలదే విని పిన్నలు పెద్దలు సంతసింపఁగ ౯.

వేంకటేశ్వరుఁడు సహించినను దిర్పతి సహింపఁడం
దురే ? తిరుపతిఖ్యాతికి గారణభూతుఁ డైన వేంకటేశ్వరుఁడే
సహించిన యెడలఁ దిరుపతి సహింప కున్న నెవరు పాటింతు
రనియు, బాలకులు వీ రేమి సేయఁగల రని తలంచిరి కాఁ
బోలు. లేకున్నచో దుర్వైదుష్ీభరము మొద లగు నిందోక్తు
క్తులు మొట్టమొదటనే వ్రాసియుండరు. అవి కూడ మేము
వ్రాయ నేర్చి యున్నార మే యనియు, విశేషముగాఁ జర్ల
నారాయణ శాస్త్రి గారి యొద్దఁ జదువుకొంటిం గాన వారి నే
గురువు లంటిని ; అంతమాత్రమున నాకిఁక నెవ్వరును గురువు
లే కారా ? ఓనమలు సెప్పిన వారును గురువులే. నే నేమైన
గురుధనమును హరించిన వాఁడనా ? నాయం దేల కృతఘ్నత
నారోపించెద రనియు, విష్ణుపురాణములో నేదియో వ్రాసి
యున్న దని నన్ను నిందింప నేల ? నేను తత్పరత్వముచేత
వేంకటశాస్త్రిగారు గురువు లని చెప్ప కున్నను (అనఁగాఁ
బ్రధానోపాధ్యాయుఁ డని చెప్పకున్నను) మీరు సెప్పుకొను
చున్నారు చాలదా ? యనియు నీ పద్యములు నుడువు
చున్నవి.

ఈ పద్యములకు ది. తి. శాస్త్రిగా రిట్లు బదులు వ్రాసిరి.

చ. తిరుపతిచేతవచ్చెనా యతిప్రతిభా మహిమంబు వేంకటే
శ్వరునకు వేంకటేశ్వరునివల్లనె చెందెనా యామహత్త్వముల్
తిరుపతి తద్వివేకము నిలింపులు సైత మెఱుంగరింతకుం
దిరుపతి వేంకటేశ్వరుల తేకువఁగా కవులందనేర్తురే!

చ. తిరుపతి మార్గమిట్టిదని తెల్పిరొయియుంటిని చాలియున్నచో
జరపుఁడు తత్ప్రచారములు చాలకయుండిన మూలనుండుఁ డె
వ్వరుఁ గనకుండఁ జాఁటుగను బద్యములంపెద రేమిలాభమే
సరసులు మెత్తు రిక్కుటిల చారపుఁజేఁతలు రచ్చకెక్కినన్.

ఉ. అర్భకు లేమిసేయఁగల రంచుఁ దలంచితి వన్నమాట సం
దర్భములేని దర్భకపదంబు వయస్సున మీకుఁ జెల్లునే
యర్భకుఁగన్న నారలెటు లాదురు చెప్పు చెప్పు డిం
కర్భకులెందు నోకవిత యందునా? యింకొకదానియందునో ?

చ. అనృతముగాని మేమనిన యట్ట్రిప్రసంగము గాదటంటిరా
వినిన మహాత్ములేమయిరి వీనులు సూడిన భంగివారు కా
దనిన నిజంబునే ననృతమాడినవాఁడ నిజంబటన్న నే
యనువున నీకృతఘ్నబిరుదాంకము వాయునో రామ చెప్పుమా ?.

చ. మఱచితివేమొ యొంతమతి మాలిన మానిసివైతి వయ్యో శం
కరునిగృహంబునన్ ఋణముగాఁగొని కాకరపర్తివాసు లె
వ్వరో భవదుత్తమర్ణులకుఁ బ్రాతఋణంబులు దీర్చుకొంటివే
గురువగు వేంకటేశ్వరునకున్ మఱితద్ధన మీవొసంగితే ?.

చ. గురుధనమున్ హరించితివి కూళకృతఘ్నుఁడ వంటినో గురుం
గురువుగఁ జెప్పుకొంటయును గూడదటంటినొ లేదు శ్లోకా
క్షరమె యొసంగ నీతనకు గౌరవపాత్రుని వద్యులింపుచుం
గురువుగఁ జెప్పుకోని చెడుకూళ్ళఁ గృతఘ్నుని గాఁగనెంచితిన్.

ఉ. వ్యాకరణంబుఁ జెప్పినది యంటక పోయినఁ బోవుఁగాక నీ
కేకవి నామ మయ్యనఘుఁ డేకద పెట్టినదంతఁ బోక తా
నేకడ కేగెనిన్నుఁగొని యేచనె నచ్చటి కట్టిచాని సు
శ్లోకసభాస్థితిన్ విడిచి చోరుగతిన్ మలఁగంబనేమొకో ?.

సీ. ఇంజరంబొక సాక్షి యేనాము దా సాక్షి
పల్లెపాలెంబు దా నెల్లసాక్షి
యిపుడు నీవున్నట్టి యీ పిఠాపురిసాక్షి
యేలూరుసాక్షి నీయిల్లుసాక్షి
వల్లూరునృపతి శ్రీ భాష్యకారులుసాక్షి
నూజవీడ్రామ చంద్రుండుసాక్షి
మంజువాణీప్రెస్సు మానేజరొక సాక్షి
శంకరుండాతని సోనిసాక్షి.
మధనవంతుల సూరయ బుధుఁడుసాక్షి
యయ్యనఘునన్నసాక్షి సుబ్బయ్యగారు
సాక్షులున్నారు పద్యంబు చాలదింక
వేంకటేశ్వరు శిష్యుఁడవే నిజంబు.

గీ. వేంకటేశ్వరు పాదంబు వీడి పిదప
నెవని సేవించితివి చెప్పుమింతయేల ?
యే విషయ మీవు సాధించినావొ పిదప
వ్రాయుమా వేంకటేశ్వరు పదములాన.

(1) పద్యము. వారిలో నెవ్వరివలన నెవరికిఁ బేరువచ్చిన దో దేవతలకు సైతము తెలియదఁట! బ్రహ్మకైన భేదింప రాదఁట! పోనిండు మనకెందులకు? వా రంత రహస్యముగాఁ గాపాడుకొను దానిని బైటఁబెట్ట రాదు.

(2) పద్యము. ఈ విషయమై చాటుగఁ బ్రచురించిన యను చోట విస్తరించి వ్రాసియున్నాను.

(3) పద్యము. తలలు నరసిన తాతలు తామే బాల కళానిధుల మనియు బాలకవుల మనియు వ్రాసికొనుచుండఁగ మే మర్భకుల మని చెప్పికొనఁ గూడదా? మఱియు "నర్భకులు కవిత యందా?" యని ప్రశ్నించుచున్నారు. వారి బాలకళానిధిశబ్దమునకుఁ గూడ నర్థ మట్టిది యే కాఁబోలు!

(4) పద్యము మొదట నీ విచారము జరిగినచో బాగుం డును. ఇప్పుడు మే మట్లంటి మని యొప్పుకొనుట యే సమం జసము గాఁ గన్పట్టుచున్నది.

(5) పద్యము "గురుధనమును హరించితిని" యనుచో గుమ్మడికాయల దొంగ యనఁగా నే బుజములు తడవుకొను వాని వలె * మఱియొక యర్థము సేసికొని దాని కనుగుణ

---

* బ్రహ్మయశాస్త్రులు గారియొద్దఁ గొన్ని వందలు ది. తి. శా. గా రప్పు గొని రఁట. ఆయప్పు రాఁబట్ట నభి యోగము కూడ జరి గిన దఁట.

ముగ వేంకటరామశాస్త్రి గారి పై దోషారోపణము సేయు తలంపుతో నిది వ్రాయఁ బడినది. ఏలూరిలో మ. రా. రా. సోమంచి భీమశంకరము గారి యింట వేంకటశాస్త్రిగారియొద్దఁ జదువుకొను నప్పుడు వేంకటరామశాస్త్రిగారును వారితోఁ గొన్ని మాసము లుండి రఁట. అప్పుడు కాకరపర్తి గ్రామవాసులైన "ద్వి. బ్రహ్మానందశాస్త్రిగారు చ. సూర్యనారాయణశాస్త్రిగారు" అను పండితు లిరువురు మార్గవశమున నచ్చటికి వచ్చి తమచేతిలోని సొమ్ము ఖర్చుపడి యుండుటచే నిడదవోలు స్టేషనువఱకు ధూమశకటము పైఁ బ్రయాణము సేయుటకు బదులిమ్మని వేంకటరామశాస్త్రిగారి నడిగి రఁట. అప్పుడు వేంకటరామశాస్త్రిగారు తమయొద్ద సొమ్ము లేదనియు వేంకటశాస్త్రిగారి నడుగుఁ డని యుఁ జెప్ప వారలును "మేము వేంకటశాస్త్రిగారి నెఱుఁగము మీరే చెప్పి యిప్పింపుఁడు మేము వెంటనే పంపెదము" అని చెప్పగాఁ వేంకటరామశాస్త్రిగారాసమాచారమును వేంకటశాస్త్రిగారితో సవిస్తరముగాఁ జెప్పిన వారును సమ్మతించి యించుమించుగా రు 1-8-0 లు యిచ్చిరఁట! ఇది వేంకటరామశాస్త్రిగారు వేంకటశాస్త్రిగారి యొద్ద నప్పు పుచ్చుకొనిన సొమ్ముతోఁ గాకరపర్తి వాసులకుఁ బాత్రయప్పులను దీర్చుకొన్న విధము. అనన్యసాక్షిక మగు నీవృత్తాంతమును వేంకటశాస్త్రి గారు మఱియొక లాగు వ్రాయుట యుక్తము కాదు.

(6) పద్యము "వెనుకటిపద్యమును గోపిధావేశముచే నట్లు కల్పించితిని గాని నీవు గురుధనమును హరింపను లేదు; కృతఘ్నతయు లేదు; నారాయణశాస్త్రిగారిని గురు వని చెప్పుకొనుటయు స్తవనీయము; వేంకటశాస్త్రిగారి యొద్ద విశేషముగాఁ జదువకుండుటయు నిజము. ఇఁక నేమన వేంకటశాస్త్రిగారు కొంచెము చెప్పినను గౌరవపాత్రులు; వంద్యులు; అదియుంగాక లోకప్రసిద్ధి గలవారు. అట్టి వారిని గురు వని చెప్పుకొనుట వలనఁ గీర్తియుఁ గూడ హెచ్చును. ఆయనను గురు వని చెప్పుకొన రాదా? ఏల చెప్పుకొన లేదు?" అని యింత యభిప్రాయమును గర్భములోఁ బెట్టుకొని యీ పద్యము బయలు వెడలినది.

చదువరులారా! మన మందఱముఁ గలసి యీ విషయమున వేంకటరామశాస్త్రిగారి నెంతయు నానందించ వలసియున్నది. వేంకటరామశాస్త్రిగారికి వలెనే లోకోపకారార్థమై యవతరించు కవుల కందఱకు నిట్టి సద్బుద్ధిఁ బ్రసాదింపఁ బరమకారుణికుం డగు జగదీశ్వరుని వేఁడుదము. కొన్ని మాసములు చదువుకొనినంత మాత్రమున ప్రసిద్ధులగుటనుబట్టి వేంకటశాస్త్రిగారే నాకుఁ బ్రధానోపాధ్యాయు లని చెప్పికొనక రాత్రింబవళ్లు కష్టపడి విద్య గఱపుట యే కాక మిత్రునివలెను

బుత్తు్రినివలెను మిగుల నాదరించిన శ్రీ నారాయణశాస్త్రి గారినే తమ గ్రంథములలోను సభలలోను జెప్పికొనుట వేంకటరామశాస్త్రిగారి కెంతయు నలంకారముగా నున్నది అట్లుగాక యది కృతఘ్నతగా నే భావింపఁబడినచోఁ గవిరాజబిరుదాంకితు లగు శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు మున్నగు పలువురు పండితుల యొద్దను గవుల యొద్దను విద్య నేర్చియు బ్రహ్మయ్యశాస్త్రిగారినే ప్రధానోపాధ్యాయులు గాఁ బరిగణించు వేంకటేశ్వరులును గృతఘ్నులే యని చెప్పక తప్పదు ఒకవేళ వారే జాతకచరిత్రలో నైనను వ్రాసినా రనినచో వేంకటరామశాస్త్రి గారును వారచర్యలో వ్రాయక పోరు!

(7) పద్యము—ది॥తి॥శాస్త్రిగారు చెప్పినట్లు వేంకటశాస్త్రిగారి పాండిత్యప్రభావ మెట్టిదో కాని యది యప్పు డంటనే లేదఁట! తరువాత వేంకటరామశాస్త్రిగారు వారియొద్దఁ జదివినదానినే మఱల దృఢపఱుచుకొని పైగ్రంథమును బూర్తి సేయ వలసివచ్చినదఁట. "వేంకటశాస్త్రి" గారి యొద్దఁ జదువ వచ్చుటకు ముందే వారుకవిత్వము చెప్పుచుండుటచే నప్పుడప్పుడు "వేంకటరామకవీ"! యనిపిలుచుచు వచ్చిరికాఁబోలు!

(8) పద్యము—వేంకటశాస్త్రిగారు తమగురువులలో నొకరు గారని వేంకటరామశాస్త్రిగా రెందును జెప్పి యుండ

లేదు. కావున సాక్షులతోఁబని లేదు. "వేంకటేశ్వరు శిష్యుఁడ వే నిజంబు" అని చెప్పి నంత మాత్రమునఁ దృష్టిగా లేదు. మీఁద వ్రాయు ప్రతిగ్రంథమందును గురుస్తుతిఁ జేసినపిదప వేంకటరామశాస్త్రిగారు వేంకటశాస్త్రిగారికి శిష్యుఁ డని కూడ వ్రాసికొనుఁడు.

(౫) పద్యము—వేంకటరామశాస్త్రిగారు వేంకటశాస్త్రిగారి యొద్దఁ జదువుకొనుట మాని యిప్పటికిఁ బదిసంవత్సరములు కా వచ్చినది. అపుడువారి కప్పటి కించుమించుగాఁ బదునాలుగు వత్సరముల ప్రాయ మై యుండును. అంత పిన్నతనముననే వారు విద్యను ముగించియుండలేదు.

ఇప్పటి కుత్తరప్రత్యుత్తరములు ముగిసినవి. ఇంతటితోఁ బనిలేని సనక వారు వ్రాసిన మఱికొన్ని పద్దెములు.

సీ. చదువఁగా లేదెవిశ్వము మెచ్చఁ బత్రికా
పరముగాఁ బ్రకటింపఁ బడినలేఖ
వినిపింపలేదె నివ్వాఃపాటుతోమిముం
బోషించుచున్న మీభూమిపతికి
సభలు చేయింపఁగాఁ జాలరె విద్యావి
శారదుల్లైన భూస్వామివరులు
మధ్యవర్తులు గారెమహనీయులైనవి
ద్వాంసులుసుకవితాదక్షతములు

బీర మేమయ్యెనో నేతిబీర కాయ!
మాన మేమయ్యెనో ప్రతిమాకపింద్ర!
పౌరుషం బెచ్చటికిఁ బోయె బాలరాయ!
కీర్తియెందడుగంటెనో కీర్తిముఖము!

శా. మాకన్నన్ మహనీయులైనకవులీక్ష్మామండలిన్ లేకపో
రీకాలంబున యుష్మదీయ కవితా ద్వీపంబు ముంపంగన
స్తోకాకార మదీయదివ్య కవితాతుంగార్భటీఘూర్ణగం
గాకల్లోలవతీ ప్రవాహంభర వేగ ప్రక్రియల్ చాలవే?
గీ. మిమ్ముఁ బోషించుటేమి దోషమ్ము పతికిఁ
దగవిగర్వంబు మీకుండఁ దగదుగాక
అంటుమామిడి గున్నపై నధివసించి
నంతనే కాకికోకిల యగుటగలదె.”

చ. ఎఱుఁగక మాఱునాడితి మహీనమతి ప్రతిభాధురంధరుల్
తిరుపతి వేంకటేశ్వరుల దీటగువార మె యంచు నేఁడ మీ
నరపతి యూరకుండెనని నామదినెంచెద లేకయుండినన్
సరసుఁడు పీఠికానగర నాథుఁడు దారుఁడు మిన్నకుండునే?

ఇవి కేవలము క్రోధావేశమున వ్రాసిన పద్యములు కాన నీ పద్యముల విమర్శింపరాదు. పూర్వ మిట్లే కొన్ని దూషణ వాక్యములను విడిచి యున్నాడ.

సీ. వ్యాకరణంబునందు సమానమతిశాలు
లైనచో రండు వాక్యార్థమునకు
నుభయ భాషాకవిత్వోద్దేక బిరుదంబు

కలదేనిరండు తత్కాలనమునకు
శతవధాన ప్రవీణత గన్న పేర్వాసి
యున్నచో రండు పేరొకన్న పనికి
నితర విద్యాభి మానేద్యత్వ మెందేని
యమరిన రండు వ్యాహారమునకుఁ
దగిన ప్రభువుల ప్రేమాల మీదార్థ్యమెల్ల
నీరుగాఁ జేసి యేయూరు పేరు లేక
యుండఁగాఁ జేసి వరిపేలపిండి పగిద
నెఱపఁ దలఁచితి మిదయె మానిష్టవినుఁడు.

ఇది వెనుకటి పాటయే. కాని గీతపద్యములో నంతకంటెఁ బాకము ముదిరినది.

ఉ. తాల్చితిఁ గంకణంబుఁ గవితావిషయంబుల నెందునేనియుఁ
గెల్చెదనంచు; గెల్తు మహనీయుల ముందర; నొక్క చోటికిం
బిల్చెదరమ్మ లేక పిలిపించిన వచ్చెదలెమ్మ లేనిచోఁ
జెల్చనవాసి వేంకటకవి ప్రవరుణ్ మదిఁగొల్చుచుండుమా.

కవితావిషయంబునఁ గంకణము నెక్కడఁ దాల్చిరో?

గీ. ఎదరి మీతోడ వాదింప నెంతు రేని
రెండు మాసంబు లిటులూర కుండువారె
ఓడి రనుకొనుచున్న వారర్వజనులు
ఎవ్వ రేమనుకొన్న నిందేమితప్పు ?

ఈశ్వరవేద లని యెవ్వ రనుకొనుచున్నారు? మీ కుల వృద్ధుఁడా యని యడిగితిరే? ఓడి రని మాత్ర మెవ్వరనుకొ

నుచున్నారు : మీా—

గీ. లేడిపై దూఁకు సింగంబు • జాడవచ్చి
పడుదు మన్నంత వేగిర • పాటుగలదు
గారవించునో లేదో భూ • కాంతుకడఁ
బిల్వ కేగఁగ రాదంచు • నిల్వవలసె."

వహ్వా! ఇది యే యూరిసింగము? ఎంత వేగిరపాటుతో నున్నది!

"గీ. దీని కేనుత్తరంబు రా • దేని మమ్త్ర
కాదు చూ గెల్చుటరయలో • క్షత్రయైక
విజయ సాధకమగు గొప్ప • విద్యగల్గు
వారటంచుఁ దలంచి యే • నూరకుంద."

మంచిది ఊరకుండుటయే మీకు శ్రేయము.

ఇఁక నొకచోట సభలు చేసి యన్యోన్యబలములు గనుపఱిచుట కవకాశ ముండునా యను నంశమును మాత్రము చర్చించి యిది యింతటితో ముగింతము. వెంకటరామశాస్త్రిగారు తమ్మేమో యని రని యెవరో చెప్పినంత మాత్రమున వెనుక ముందుఁ జూడక వినరాని మాటలాడు తిరుపతివేంకట కవులును మేమును నొకచోట సభ చేయు నెడల నది సరసముగ సమాప్తి నొందదు. క్రోధైకాయత్తచిత్తత నొకరి నొకరు గెలువదలఁచి యొక రెద్దియే నుపక్రమింప రెండవతెగవా రున్నవి యో లేనివి యో దోషము లెన్నక మానరు. మొదటిపక్షు

మువా రవి దోషములు కావని వాదింపక మానరు. మధ్యవర్తు లెవరి కాగ్రహము వచ్చునో యని యు నెవ్వ రేమి పద్దములఁ జెప్పి తమ్ము దూషింతురో యనియుఁ దగవుఁ దీర్చుటకుఁ బూనుకొనరు. ఒకవేళ వారిలో నెవ్వరైన నిజము చెప్పఁ దలఁచినను విజయాకాంక్షులై పోరుచున్న యుభయపక్షముల వారికిం గూడ వినఁబడవు తుదకు "త్వంశుంఠః త్వంమూఢః" అని కచాకచిఁ గలహము గలుగు ననుటకును సందియము లేదు. ఇట్టి పోరును జూచి యానందించు మహారాజులు సైతము ప్రస్తుతకాలమున మిగుల నరుదుగా నున్నారు. కనుఁగొనిన వారు పల్వురు నవ్వుటయు నొకపక్షమువారు శిక్షాపాత్రులగుటయుఁ దప్ప మఱియొక ప్రయోజన మేమియుఁ గలుగదు. శక్తి యున్నఁ బ్ర[illegible]కస్థలములయందు సభలు చేసి యొకరి కన్న నొకరు ఘను లనిపించుకొనఁ గూడదా? క్రోధావేశముచే ది. తి. శాస్త్రిగారు వ్రాసినవి. నిజ మెఱుంగనివారు కొందఱు నమ్ముచుండుటను ఇఁక ముందైనను దిరుపతివేంకటకవులు పరనిందాపరాఙ్ముఖు లగుదు రేమో యను భ్రాంతిచేతను నే నిది వ్రాసితిని గాని తిరుపతివేంకటకవులను దూషింపఁ దలంపుతోఁ గాదు.

ఆర్యులారా! ఇది యంతయు నప్రస్తుతప్రశంసయేనా? గ్రంథనామము సార్థకముగ నున్నదా?

శ్రీ పీఠికాపుర సంస్థానకవి. రామకృష్ణశాస్త్రి. శతావధాని.

# శుద్ధపత్రిక

| పుట. | పంక్తి. | ఒప్పు. | పుట. | పంక్తి. | ఒప్పు. |
|---|---|---|---|---|---|
| 1 | 11 | సామర్థ్య | 14 | 17 | సెప్పుచో |
| 2 | 5 | సామర్థ్యా | 18 | 16 | పురమేయా |
| ,, | 6 | తఱచు | 19 | 5 | సభలేయా |
| ,, | 14 | వేంకటరా | ,, | 18 | యథార్థ |
| 3 | 10 | శాస్త్రి | 20 | 1 | ప్రతిష్ఠ |
| 4 | 10 | చిన్నటి | ,, | 4 | తేజ్జులలో |
| 5 | 9 | గురుతె | 22 | 9 | కీటకన్ |
| ,, | 12 | ప్రథమ | ,, | 12 | యథార్థ |
| 6 | 8 | వేంకట | ,, | 20 | దూఱు |
| ,, | 17 | జెప్పుట | 23 | 6 | దలంచితిరి |
| 10 | 1 | తిరుపతి | ,, | 15 | దత్పర |
| 11 | 5 | శతా | 24 | 13 | లెక్కులర్భకు |
| ,, | 10 | నూఱు | 33 | 13 | గనుపఱు |
| ,, | 15 | సరస్వతీ | 34 | 6 | శుంఠః |
| ,, | 19 | కలగూరగంప | ,, | 12 | ప్రత్యేక |
| 12 | 5 | బుచ్చుకొను | ,, | 17 | శంసయేయా |
| 14 | 4 | అని | | | |